అనిసెట్టి సుబ్బారావు

---

# అగ్నివీణ





అభ్యుదయ ప్రచురణ

3

చేతనసాహితి
నరసరావుపేట

★
సంకలనకర్త:
ప్రయాగ

★
వర్ణచిత్రరచన:
మా. గోఖలే

★
వెల: రూపాయి

తొలిముద్రణ:
అక్టోబరు 1949.
సర్వోదయప్రెస్, నరసరావుపేట

నరబలిలో, చిరపీడనలో
గుడిలో, యంత్రపు దోపిడిలో
హతులౌ పతితుల ప్రాణజ్వాలలతో

లోకపు చీకటి
కన్నుతెరుస్తూ,

నూత్నమానవుని
కూపిరి పోస్తూ,

అసత్య,హింసల ద్వేషిస్తూ,
సమధర్మం స్థాపిస్తూ,

అధోజగత్సహోదరుల
కంఠగనిలిచిన వీరులు,
అజ్ఞాతులు, అనామకుల
కభివందన సందేశం!
అగ్నివీణ సంగీతం!



"అగ్నివీణ" చదివిన ప్రతిపాఠకుడు
తన అభిప్రాయాన్ని తెలియజేస్తే
"అనిసెట్టి" కృతజ్ఞుడు

---

★

జ్వాలాతోరణం

★

శాసనాలు

★

మాతృసంగీతం

★



తెగని గొలుసులో లంకెలు
తీయని మన బ్రతుకులు,
తారా సముచ్చయం వలె
ఆత్మ లగ్ని గోళాలు!
నీవూ నేనూ అంతా!

భువన భవనమున చీకటి
పునాది పెకలిస్తాము!
ప్రకృతి శక్తి సముద్రం
మధించి బంధిస్తాము
నీవూ నేనూ అంతా!

'ఓహో' యని పాడ ప్రకృతి
'ఓహో' యన మానవుడు
అమరకిరణ గణ స్పందన
విశాల విశ్వం నదించు
నీవూ నేనూ అంతా!

*

వచ్చాను వచ్చాను:



వచ్చాను వచ్చాను
వ్యాస సంతతి వాణ్ణి!

వెళ్ళిపోయిన కోటి కోట్ల జీవుల విడిచి
కుళ్ళిపోయే నేటి కోట్ల జీవులకొరకు
పొర్లివచ్చే కోటి కోట్ల జీవులకొరకు

వచ్చాను వచ్చాను
వ్యాస సంతతి వాణ్ణి!

కలగుండు వడియు నిశ్చలమైన గుండెవలె
నిద్రించు నీటిలో విడుచు పొడిరాయివలె,
అడవులూ, పడవలూ 'అహాపు' ఎల్లలు దాటి

వచ్చాను వచ్చాను
వ్యాస సంతతివాణ్ణి!

పగిలించి రణభేరి, పద్మవ్యూహముత్రెంచి
శివమెత్తి విస్ఫులింగములు చిమ్ముతులేచి
ఈజగతిలో నూత్నజగతి పెకలిస్తాను

వచ్చాను వచ్చాను
వ్యాస సంతతి వాణ్ణి!

తలలొగ్గి బానిస సలాము చెయ్యరు మీరు,
ధన మదాంధత బలిసి తారసిల్లరు మీరు,

వచ్చాను వచ్చాను
వ్యాస సంతతి వాణ్ణి!

ఠాళ్లు రప్పలు ప్రాణమొలికి పులకింపగా
పరాకోటి నందు ప్రాణుల కళాసృష్టి:
ఎగసి ప్రవహిస్తుంది ఇక వెలుగు బావుటా!

వచ్చాను వచ్చాను
వ్యాస సంతతి వాణ్ణి!

ప్రేమమూర్తుల నిత్యనృత్యమై, సత్యమై
భువనముర్ సకలముర్ పొంగి పోవంగా
నిర్భరానంద మావిర్భ వించంగా

వచ్చాను వచ్చాను
వ్యాస సంతతి వాణ్ణి!

*

పిడికిలికి చాలని పేదగుండెగదా:

★ ☆

పిడికిలికి చాలని పేదగుండెగదా!
ఇందులోనిమిడి ఎన్నెన్ని లోకాలు!

చుక్కలై శూన్యాన్ని చొచ్చుకొనిపరుగెత్తు
బాహ్యగోళాలపై
దురవగాహనమ్ములై పెరిగె లోకాలెన్నొ
పేదగుండెలలోన!

రాత్రింబవళ్ళ తలుపులు తెరుచుకొని, అగా
ధానంతకాల హృదయములోన స్పందించు
ఈవిశ్వసంగీతములో;
నిరుపేదగుండెలందిమిడి లోలో కుములు
లోకాల శోకమ్మై
అస్పష్ట మార్తారవమ్ము వినవచ్చు!

విశ్వసంగీతమే!
కడుపులో పాలతో కల్మషస్రవంతివలె
కాంతిరస ముబుకు చీకటిపండువలె నుండె!

తమలోన తామెరాపాడి విహ్వాలమౌచు
పిడికిలికి చాలని పేదగుండెలలోన
ప్రభవించె చిత్రమై! బహుప్రపంచసృష్టి!

*



ప్రతి ఒకడూ శివుడునేడు!

డమరుకమై భువి దద్దరిల్లు!
బుసకొట్టే విష ఝుంఝులు
పొర్లి త్రెళ్ళి పోతున్నవి!
ప్రతి ఒకడూ శివుడు నేడు!

'భూత' కాల గళము మరిగి
కాలకూట మావిరులౌ,
'నేడు' ప్రళయరుద్రుని
త్రేతాగ్ని శిఖల దహనమౌను,
'భావి' మకుట దీప్తులెగయ
ప్రతిఒకడూ శివుడు నేడు!

విధికరములు మలిన జలధి
విసిరిన మణికిరణమువో!
పొగ కమ్మిన రాత్రి త్రోసు
కౌనిపర్విన కిరణమువో!
బాహ్యాంతర మనురాగ
ప్రదీప్తమౌను!

ప్రకృతి జీవనోద్వేగము
పదములంటి పట్టినదా,
ప్రాణం ప్రవహించినదా!
ఈ అగాధ నీరవ సుందర
విశ్వ హృదయములో శిరము నిలుచు,
అడుగందని లోతు కొలుచు!

ప్రతిఒకడూ శివుడునేను!

*

మీతోనే వుంటాను! మీతోనే వస్తాను:

 

మీతోనె వుంటాను! మీతోనె వస్తాను!
అడుగడుగునా మీకు అండగ నిలుస్తాను!

పరతంత్రతలో మగ్గు జానిసలముక్తికై
కదనభూములకెత్తి కదిలి వెళ్ళేమీకు
అడుగడుగునా నేనె అండగనిలుస్తాను!

మీ స్వతంత్ర జగత్తు నిర్మించ పోరాడు
మీ ఉనికికే ముప్పు మించివచ్చిన నేడు
మీ ఏక హృదయమై మ్రోగు జయభేరి నే!

యుగ యుగాలుగ మీలో వెలుగు స్వేచ్ఛాజ్వాల
ఈ శుభదినాలలో ఎగసినది భగ్గుమని
అడుగడుగు ఆకాశమంటి నినదిస్తాను!

మనపురా దాస్యమై దగ్ధమై,
మనపురా ఆదర్శమగ్నియై
అడుగడుగునామనకు హారతిడు భూమాత!

ఆకాశమపని ఉగ్రూతలూగే నేడు
మీతోనె వుంటాను! మీతోనె వస్తాను
సమర హృదయంనేను; స్వాతంత్ర్య జయభేరి!

పతిత ప్రజలగుండె పరిపుల్లమయ్యేరా,
దిక్కులన్ని మనకు దివిటీలు పట్టెరా,
సాగురా స్వాతంత్ర్య యోధుడా!

వెనుక: బంగరుపండు అమర ప్రజలు! ముందు:
సమధర్మ సంఘ సంస్థాప నోత్సవమురా!
సాగురా స్వాతంత్ర్య యోధుడా!

అడుగడుగునా శత్రువణిగి పోతాడురా,
వెనుక: సామ్రాజ్యాల శాశ్వత సమాధులై.
ముందు: శత్రుక్రూర మృగము తుత్తునియలై
అడుగడుగు మంట లెగసే కంఠఘోషతో
సాగురా స్వాతంత్ర్య యోధుడా!

మీబాహుబలముగా మించుతున్నానురా!
మీదృష్టి తేజమై మెరయుచున్నానురా!
మీ ఒకేగుండెగా మ్రోగుతున్నానురా!

మీతోనె ఉంటాను! మీతోనె వస్తాను!
నేనె మీ జయభేరి! నేనె మీ బావుటా!

*

తల్లీ ధరణీ! నీయెద చల్లగా ప్రయాణింపుము!

 

తల్లీ ధరణీ! నీయెద
చల్లగా ప్రయాణింపుము,
పొంగి పొర్లి భువినిండిన
ప్రాణప్రవాహమునీవై!

కలలో వలపన్ని తెచ్చి
కట్టెదుటారాధించిన
దైవము నిర్జీవ మయ్యె!

ప్రాణ బీజములు పండే
తరువు లెండె!
ప్రాణలోకములు పొదిగే
సంద్రమింకె!
రోదసిలో వికృత వదన
రోదనములు!

ఎగసిన ఎర్రనిసూర్యుడు
ఎత్తినగుప్పిట ముడిలో
ఒత్తిగిలిన ప్రాణజగము!

తల్లీ ధరణీ! నీయెద
చల్లగా ప్రయాణింపుము!

డుల్లలైన గింజలకై
తల్లడిలే చీమలమై,

ఇసుక తుపానులలో
విచ్ఛిన్నమైన చీమలమై,
కరువు బరువునెత్తిన
మాకంఠములకు—
అదిమిన చిక్కని చీకటి
యెదలో ఉరి త్రాడులు
నక్షత్రకాంతి నాళములు!

తల్లి ధరణీ! నీయెద
చల్లగా ప్రయాణింపుము!
సౌరభ మాకృతి పొందిన
వికసించిన కుసుమము వై!
పలపల బీజములు పండి
కలకల లోకములు పొదిగి!

మానవ సమాజ నృత్యపు
మహితాశయ కేళిగనక,
పగలు రాత్రి జలద్వర్ణ
వసనములై కడల గ్రమ్మి,
వెడలివచ్చె నవోఢయై
కాంతి పుంజమై కాలమె!

తల్లీ ధరణీ! నీయెద
చల్లగా ప్రయాణింపుము!

*



ఎందుకు తల్లీ!
నన్నీ
వింతమానవుల అడివిలో
విడిచి వెళిపోయావు!

పగలు లేచు పడగెత్తిన
పగతీర్చుకునే పామై!
రాత్రి రక్కసయి విసరును
తళతళమను బల్లెములను!

కడుపుకాల్చి గర్జించే
భక్షించే ఆకలిపులి!
మెడచుట్టూ పాశములై
శపిస్తున్న పసిబిడ్డలు!

చుక్కల లోతులుకొలిచే
శోధకునికి కానివాణ్ణి!
ఆనంద మనంతమనే
వేదాంతికి కానివాణ్ణి!
అందరికన్నం పంచే
అన్నలకే కానివాణ్ణి!

సాగిన బంగరు తీగయి
చనును కాలమే వారికి-

ఘడియ ఘడియ గండముగా
నిప్పుల గుండమ్మునాకు!

నా యెముకలు కాలిపోవు
నాగరికుల చలిమంటలొ,
నా నెత్తురు కారిపోవు
నాగరికుల చలి వేంద్రలొ!

ఇంటికి పెద్దన్నను! న
న్నొంటిగ హత ప్రాణినిగా
వింతమానవుల అడివిలొ
విడిచితి వెందుకు తల్లి!

*

ఎంతచక్కనికనులు ఈరాత్రివిప్పినది!

★ ★

ఎంత చక్కనికనులు ఈరాత్రివిప్పినది!
ఎంతచక్కని కాంతుఏరాత్రి పండినది!

కారడువులే శిరములెత్తి పులకింపగా
ఇసుక గుట్టల యెడారుల దొమ్ములేపొంగ
ఎంతచక్కని కాంతు! లెంతచక్కని కనులు!

పసరు బాలింత మొగమెత్తి నవ్వినతృప్తి
భూమాత కీనాడు!

.... .... ....

గాఢ నిద్రలో శిశువు పెదవిపూచిన నవ్వు
లేదు నాగుండెలో!

భూమాత యుగయుగమ్ములు కన్నకలలకై
భూమాత యుగయుగమ్ములు విన్న పిలుపుకై
పసి పరుగులెత్తు నాకడకు:

భూమాత రొమ్ముకుమ్మిన ద్రోహంలేవచ్చి
ఇనుప కమ్మీల చట్రాల కిందికి త్రోసి-
ఎడలేని తారుగోడల మధ్యనాబ్రతుకు!

ఇనుము నే తవ్వినది! పోత నే పోసినది!
కదలేని గోడలు, పొడలేని తారు
కట్టాను నేను! కాచాను నేను!

సర్వశాస్త్ర జ్ఞాన మొక్కరాక్షసి యౌచు
బంధించినది నన్ను!

.... .... ....

ఎడలేని తారుగోడలమధ్య నాబ్రతుకు!
ప్రాణ నృత్యోత్స వామృత సుఖముబైట!
కడలేని చీకట్లదుముకున్న కూపమిది-
నా వ లె నె!

ప్రాణ ముక్కిరి బిక్కిరైన పసిగాలి
మూర్ఛిలి పడినదిచట-
నా వ లె నె!

కనుగాన కలిసి పెనగిన కిరణ
మురి వేసుకుని పడిన దిచట-
నా వ లె నె!

.... .... ....

ఓహోహో!

హాయలెగయు హేమ గోపురములతో
నిద్రించు శిలలదేవతలో!
ధగ ధగని వెలుగు దీపాలతో
నిర్జీవ దేవవిగ్రహములో!
గర్భగుడిలో!

మధనమై నాహృదయ ముత్పాతమై పెరిగి
శిధిలమౌ ఈదగాసత్య పీఠాలన్ని
ముంచెత్తి డీ ద్చుకొని పోవా!

.... .... ....

నాడు ప్రాణమె నవోదయమూర్తియై లేచు!

ఆ వేళ-

జగతి నా అతిధియై
దోసిళ్ళనెత్తి సర్వము వేడుకొనవచ్చు!
నాడు నామనసూగి కరుణమై కడలియై
మణుల హస్తాలెత్తి వెల్గించు జీవపధముల్!

ఆవేళ-

అణువులో అనంతములో
నాకనుల కాంతినిండు!
నావాక్కు ప్రాణమిచ్చు!

*



రండులేచి! రండులేచి!
బాధా జీవప్రవాహ
పరమాణువులార రండు!

ఇల భీషణ నృత్యంలో
పడిసడలిన పరాజితులు
కలలో పులిపంజలెగయ
కని హడలిన పరాభవులు
రండులేచి!

తలలు త్రెంచి శోణితమున
దాహమేల తీర్ప సఖా!
ధర విదల్చి చిరబంధన
జరామరణ చింతయేల!
రండులేచి!

పరుల ఇంటి అరుగుపైన
పవళించిన పాంథ సఖా!
ఊరి చివరి నడబావిలొ
జారిన ఓఅంధసఖా!
రండులేచి!

రంపమెత్తి, రాళ్ళుకొట్టి
ఊరుకట్టి, దారివేసి
కొమ్మలేని చెట్టుకింద

కుమిలిపోకు లెమ్మసఖా!
లేచిరమ్మా!

నరనరమ్ము మధురసమ్ము
నయనమ్ముల నగ్నికణము
పతి నీచోన్మత్తత, నీ
గతి వీధులపాలు చెలీ!
రమ్మా! రమ్మా!

బిక్క కనుల మిణుగురులే
బిగిసిన చలిలో రాత్రిగా
ఏడుపె మృతివాద్యము, నీ
యొడి శ్మశానవాటి చెలీ!
రమ్మా! రమ్మా!

పూల, చేల యౌవనాన
పొంగిపోవు యువకసఖా!
భావికాల పదహతి, నీ
ఊహాసౌధము కూలగా,
రమ్మా! రమ్మా!

దేవళాల నేవేళల
ప్రణమిల్లి కృశించి కుంగి
గర్భాలయ శూన్యకటా
క్షముల కెదురు చూచు సఖా!
రమ్మా! రమ్మా!

ఖజానాల గర్వించే,
పురాణాల పూజించే,
ప్రభువులు పండితులు రండు!

వినుడు, వీనులొగ్గి వినుడు!
జీవన నిర్ఘోష వినుడు!

లేచిరండు! లేచిరండు!
బాధా జీవ ప్రవాహ
పరమాణువులార రండు!

ఎఱ్ఱనెండ భగభగలో
కాలిపోవు రెక్కలతో
తూలిపడే పక్షులార!

మీవలెనే మేమునేడు!
మనసులోని రాక్షసమ్ము
మాపైనా కత్తిగట్టె!

ఒడ్డునపడి గిరగిర ఎగి
రెగిరి పడే చేపలార!
కప్పలార! తెప్పలార!

మాకూ దుఃఖితలోకమె!
మీవలెనే మాకు నేడు
జీవన నిర్ఝరములింకె!

పట్టూడిన తేనెపట్టు,
పడిపోయిన తేనెచుట్టు
ఎగసి వగచు ఈఁగలార!

మాకూ దుర్భర శోకమె!
మీవలెనే మాకునేడు
ఆదర్శము లాహుతయ్యె!

రండు లేచి! లేచిరండు!
కుపిత వ్యాఘ్రకోటియై
గర్జించి ఎగసి పోరినట్లు
కలుగు నేటి కిరీటాలు!
విశ్వవిలయ నర్తనలో
పృథ్వి ప్రళయ మహోద్భుత
భయంకరాహవాగ్ని కుములు!

రండు లేచి! రండు లేచి!
బాధాజీవ ప్రవాహ
పరమాణువులార రండు!

గడిచి చనిన కాలపు
చీకటికల నిదురించగా
పొడిచివచ్చు ఉదయ
మెరనెరగ ప్రభవించగా

రండు! రండు! లేచిరండు!

*

## నీ కోసమే:



నీ కోసమే కాచుకోని కూచున్నాను!
ప్రక్కనే పరుగెత్తు ప్రాణికోటి త్యజించి
నీకోసమే బ్రతుకు నిలుపుకున్నాను!

ఆకాశమూ భూమి నతికిన సుదూరాన
నీరాక పొడగట్టి, నీగంధమే ప్రాకి
ఉర్రూతలూగి ఉప్పొంగి పోవుదునంచు
ప్రవహించిపోవు జయధ్వానము విసర్జించి
ఎదురు కాపులు కాచుకోని కూచున్నాను!

ఒక్కచోనొదిగి ఊహించుకొను కాంక్షలో
పరమపావన దీప్తి ప్రసరించుననియెంచి,
తలలూపి, చేయెత్తిపిలిచి, పరుగెత్తు ఈ
ప్రాణికోటి త్యజించి!
నీరాకకై వేగిరించు కుంటున్నాను!

ఎవ్వరో నాముందు సాగుతూ, గుసగుసల్
పలుకుతూ, కులుకుతున్నారు!
ఈవ్యథాకలిత హృదయమ్మె బ్రద్దలుగాగ
విన్పించె-

ప్రవహించు ప్రాణికోటికి జీవకరమై!
జయధ్వానమై! లేచి సాగి పోతున్నావనీ,
గింజ నెదిగిస్తావనీ!

నీవె! నీవే నేడు దిగివచ్చినావా!

నాలోనిసిగ్గు కంపిత గాత్రమున నుడికి,
జయధ్వానమున నెగసిపోయిందిలే!
పరుగెత్తుకొని, గుండె నొత్తుకొని, ప్రజలలో
ఏకమై కదిలి వచ్చానులే నేనే!

*

నేనుగూడ నడుస్తాను:



నేనుగూడ!
నేనుగూడ నడుస్తాను!

శాంతికొరకు,
జగతి దాస్య ముక్తికొరకు
శత్రుసేన తుత్తునియలు చెసేందుకు
నేనుగూడ నడుస్తాను!

స్వతంత్ర సేనానివహం
భుజం భుజం రాచుకుంటు,
చేయి చేయి కలుపుకుంటు,
ముక్తకంఠ నాదంతో
నేనుగూడ నడుస్తాను!

అరివీరుల యెముకలపై
పదునెక్కిన ఖడ్గమిదే!
అరివీరుల గుండె తవ్వి
దోచుకున్న ధైర్యమిదే!
నేనుగూడ నడుస్తాను!

ప్రకృతినిసాధించి జీవి
తాన్ని శాశ్వతం చేశాం!
పాలకు లెవరైతేనేం
ప్రళయాగ్ని పోరుతాం!
నేనుగూడ నడుస్తాను!

మూడుశతాబ్దాలనుండి
రాజిన నిప్పులకుంపటి
మాదేశం!

మూడు శతాబ్దాలనుండి
దూకేచిచ్చుల పిడుగు
నాదేహం!

నేనుగూడ!
నేనుగూడ నడుస్తాను!

నేనెవరా?
మా స్వాతంత్రోద్యమాన్ని
ముందుకు నడిపేజెండా!
మానిర్భయ జీవితాన్ని
మోగే స్వేచ్ఛా గీతం!

*

ఆయ్యో! మన బెంగాల్ ప్రజ:

★ ★

అయ్యో! మన బెంగాల్ ప్రజ
ఆహుతై నశిస్తున్నది!
కన్నులున్న కరుణవున్న
అన్నలార మేలుకోండి!

ఉజ్వల జ్ఞానజ్యోతిగ
ఉదయించెగదా తూర్పున!
మానవ వృక్షంపండిన
మధురఫలంకదా! ఇప్పు
దవిసిన బెంగాల్ హృదయం!

యుద్ధచ్ఛాయలు మూగి,
మహాక్షామ మెగసివచ్చి
మనభూమికి భీభత్సపు
కాళరాత్రి కమ్మింది!

పంటలు తెగగోసినట్లు
ప్రాణాలు దహించువ్యాధి
కలకలమను మొహాలపై
మృత్యుశాసనం లిఖించు!

ఏచరిత్ర కేదశలో
ఈఘోరం సంభవించె!
నవనవలాడే పొలాలె
ఎడారులై పోతున్నవి!

గుట్టలు పడి మానవ కం
కాళాలే మూల్గి మూల్గి
వగతో, పగతో, కాంక్షతో
ఎలుగెత్తి అరుస్తున్నవి!
ఎర్రని క్రోధిత నేత్రం
విప్పి కలయ జూస్తున్నవి!
కన్నులున్న కరుణవున్న
అన్నలార మేలుకోండి!

ఆకలితో అణగారిన
కనుగందుల కలలన్నీ
గాలిలో రోదిస్తున్నవి!
జగత్తును శపిస్తున్నవి!

ప్రజాక్షోభ నాలకించి
పర్వతాలె క్రక్కదలెను,
ప్రజాశోక మాలించిన
మహానదులె త్రుళ్ళిపడెను!

మూలమూల గ్రామసీమ
ఆకలి చిచ్చులు దహించి,
ఈగలై, ఈకలై
మానవులు నశిస్తోంటే

అణువణువూ ప్రజాహృదయ
మై కంపిస్తోంది నేడు
లోహపాదమెత్తి క్షమ
దేవి తాండవిస్తోంది!

కన్నులున్న, కరుణవున్న
అన్నలార మేలుకోండి!

*

 

పగలు పగిలిన గాజుపేటిక
మంత్రకత్తెకాలం గుప్పిట!
రాత్రి హస్తరేఖలు
ఆకాశం స్రవించు చూపులు!
తెరిచిన యెముకల ప్రేవులు
బాటలు!

నాలుకసాచి ఒగర్చే
జూలు విదల్చే ఆకలి!
ఆకలి! ఆకలి!
ఆ—హా—కలి!

నడిసంద్రపు ఒడిలో
గగ్గోలై మునిగిన ఓడలు!
తృష్ణ విడక బుసకొట్టే
మృతజీవుల నీడలు!
బాటలపైపడిపోయే
ప్రజలు!

వెన్నెల నూనెతాగి
మిన్నెగసే ఆకలి!
చెదిరిన కాకిగూళ్ళు
బ్రద్దలైన పచ్చని చమురుసాగు
పసిగుడ్లు:
పడివిచ్చే శిశువుల శిరములు!

బ్రతికిన-
నమలిచీల్చివెళ్ళే మొసళ్ళు
ఉన్నవాళ్ళు:
గాదెల సుడిగుండాలలో
పెరిగిన పుణ్యం
ముక్తి కొరకు వరం!

బ్రతికిన-
కోరికి మింగి వెళ్ళేమనుషులు
జంతువులు:
అస్థులలోలో పాయలలో
చలించు వెలుగే
భుక్తికొరకు వరం!

కత్తుల బోనులలో తరిగి,
శక్తుల పాదాలకు నలిగి
పిప్పి బొమ్మలు!
పడిపోతూ ప్రజలు!
తూలుతూ, వాలుతూ
కాలే సమిధల పొగతీగలు
పడి నడిచే నీడలు!

ఆవురుమను కేకలమూకలు!
పొగతాగే వాయువులో
ఆవిరులౌ ఆయువులు!

తోవతప్పి మారుపడిన
అతిధులు ఋతువులు:
రానేరావు!

గడప విడిచి వెళ్ళదు
జూలు విదల్చే గర్జించే
ఆకలి మెదలో బాకుగుచ్చి
పకపకనవ్వే నిస్పృహ!

శాంతియుగం! ? !
దిక్కుల పుక్కిట తుపాను
శాంతి?
సముద్ర గర్భపు బడబాగ్ని
శాంతి?

మీటిన ప్రక్కలయే
నల్లని కూటికుండ:
పడిపోయేరాత్రి!
పిండిన రక్తం కక్కే
పితికిన పొదుగు:
దిగివచ్చే పగలు!

మంత్రకత్తె విప్పిన గుప్పిట-
ఎముకల ప్రేపలపై-
క్షోభా కులితజ్వాల విదల్చే
ఆకలి నాలుక!

పడి నడిచే సీడలనృత్యం

తెగిపోయిన Cosmos-జగత్తు!

*

* *

వెడలకు తల్లీ!
ఇలువదిలి కదిలి కాళరాత్రి
వెడలకు తల్లీ!

నీచుట్టూ సీటిగిరులు,
తలపైచుక్కలబాకులు
పుట్టవిడుచుపాము, మనిషి
గుండెవెడలు విషపుకోర్కె
వెడలకు తల్లీ!

నోరుతెరచి రోదసి
గర్జించు ఫిరంగుల గుండెలు!
నోరుతెరచి రోదసి
వర్షించుమేఘ విషగర్భము!
గృహముహమ్మ మూసుకో,
గృహపు వీనులణుచుకో,
నీ వమృత సుప్రకాశ
వుజ్వల మూర్తీ! శాంతీ!
వెడలకు తల్లీ!

నీపదమ్ము లంటెనో
మొరటునేల మొలచుప్రాణి!
నీనయనమ్ములు విడెనో
తెరుచుమంచు తెరలరాత్రి!

ఊరికొస స్మశానగర్భ
మురికి రుషులు లేస్తారే!
మంగళమూర్తి శాంతీ!
వెడలకు తల్లీ!

కాళరాత్రి ఒడిలో
దాగిన కత్తులూ పొంచినవో!
కాళరాత్రి ముంచెత్తే
నీటిగిరులు పొంగినవో!
నిను ప్రసవించిన ధరయే
కబళించగ నోరుతెరుచు!

వెడలకు తల్లీ!
ఇలువదిలి కదిలి కాళరాత్రి
వెడలకు తల్లీ!

*

మద్రాసు మహానగరం!



## ఉదయం:

మద్రాసు మహానగరం
అవులిస్తో నిద్రలేస్తోంది.
ఎర్రగా పాకేఎండలో
మూల్గుతూ కదులుతోంది.

ఎప్పటిలాగే
ఇప్పుడుకూడా
కాలిబాటలమీద
పార్కు చెట్లకింద
పడుకున్న పౌరులు
అదే అదే నిద్రలేస్తూ
పదే పదే ఒళ్లు విరుస్తూ
దైవాన్ని దీవిస్తూ
దాతలని శోధిస్తూ
లేస్తున్నారు వెళిపోతున్నారు!

మద్రాసు మహానగరం
కోరలు చూపుతూ రమ్మంటోంది.
పంజావిప్పుతూ రమ్మంటోంది!

ఎక్కడో ఒక్కడు
మీటనొక్కితే
ఊః ప్రవహిస్తోంది విద్యుత్తు!

అడుగున విషప్రవాహం
కాలువ!
పైన ప్రాణప్రవాహం
విద్యుత్తు!
రెంటికీ మధ్యగా
లక్షల పౌరుల నిత్యప్రయాణం!

పగపట్టిన మృగంలాగ
నగరం విప్పింది నోరు!
లక్షల పౌరుల కబళిస్తే
శిక్షాపత్రం ఉదయం!

## మధ్యాహ్నం:

నడిఎండ మహానగరాన్ని
నిప్పులకొలిమిలా కాల్చింది.
గంటలు మోగుతున్నాయి.
కార్లు మోస్తున్నాయి,
పాపం కాలువ భారంగా
భరిస్తోంది నగరం కుళ్లని,
పాపం! విద్యుత్తు బాలునిలా
పరుగెత్తుతోంది వెలుగుతో
నవ్వుతో, ఆడుతో!

మద్రాసు మహానగరం
మధ్యాహ్నం ఇంతవేళ
మృదంగంలాగ- శివతాండవంనాడు-

మెషిన్‌లాగ- మనుష్యుల్ని తినే-
మోగుతూ, మూల్గుతూ, ఘోషిస్తోంది.

ఎప్పటిలాగే
యిప్పుడుకూడా
ఇన్నిలక్షల ఆయువుల్ని
నిశ్శబ్దంగా నీరసంగా
ఆరుతున్నాయి.
హతమౌతున్నాయి.

కానీ-
బ్రతుకు కోసం భవిష్యత్తుకోసం
అప్పుడు లాహోర్‌లో, మీరట్‌లో
ఆగస్టులో
ఆర్. ఐ. యన్. లో
ప్రజ్వలించి పడిపోయిన ప్రాణాలు
పగవాని ఉరికంబాలెక్కిన ప్రాణాలు
ఈ స్మశాన నిశ్శబ్దాన్ని
ఈహత్యను, చిత్రహింసను
ఈసడించి లేస్తున్నారు,
వస్తున్నారు!

## సాయంత్రం:

బలమైన ఊహలాగ
భవిష్యత్తులాగ
వీరుల వూరేగింపు సాగుతోంది



జ్వాలలే జెండాలుగా
కేకలే ఖడ్గాలుగా
హటాత్తుగా అదృశ్యంగా
వీధులూ బాటలూ సందులూ
విరుగబడి నడుస్తున్నారు లక్షలు!

కేకలూ వెలుగులూ విని చూస్తూ
క్రిక్కిరిశారు పౌరులూ పక్షులూ
భవనాల నిండా
బస్సుల నిండా
పార్కులనిండా
సాగింది నేడే అమరవీరుల మహాయాత్ర!
కలిసింది వెళ్ళి లక్షలపౌరుల జైత్రయాత్ర!
కానీ;
కంపిస్తోంది ఎక్కడో ఒకటి
ఒక గుండె!

ఆగుండె
దుకాణంలో వుంది.
ఆఫీసులో వుంది,
ప్రభుత్వ భవనంలో
షరాబు హృదయంలో వుంది!

చీకటి వ్యాపిస్తోంది
వగలాగ, పీడకలలాగ!
చీకటి వ్యాపిస్తోంది

పారిస్‌లోంచి బారక్స్‌లోంచి
ప్రభుత్వంలోంచి, పెనిటెన్షరీలోంచి!
చీకటి వ్యాపిస్తోంది
అంక్షలాగ, ఆర్డినెన్సులాగ!

చైత్రయాత్ర పదఘట్టనతో
భయంతో సముద్రం ఊగుతోంది!
కంపిస్తో స్టాక్ ఎక్స్ఛేంజ్‌లో
గంట మోగుతోంది!

అడుగునకాలువ ఆగింది.
పైన విద్యుత్తు ఆరింది.

మద్రాసు మహానగరం
బొబ్బరిల్లి గాండ్రిస్తోంది!
సంగ్రామం సాగుతోంది
జ్వాలాపతాకలు ఛేదిస్తున్నాయి,
శిలలాంటి చీకటిని!
సంగ్రామం సాగుతోనేవుంది!
సాగుతుంది, ఇంకా, ఇంకా!

## ఎప్పుడూ:

ఎప్పుడో మరణించిన వీరులు
ఇప్పుడు బలిఅయ్యేవారులు
అప్పుడు జన్మించేబిడ్డలు
అంతా

ఇప్పుడే
ఇక్కడే వున్నారు?
అంతా
పాడుతూనే
పోరాడుతూనే
వున్నారు!

అప్పుడు ఇప్పుడు
ఎప్పుడూ కూడా
ఈ చైత్రయాత్ర సాగుతుంది.

ఆద్యంతా లీ యాత్రకుపరిధులు
అనంతమే దీనికిఅవధి!
సాగింది, సాగుతుంది, సాగుతోంది
ఇంకా ఇంకా ఇంకా!

*

లేవండి! లేవండి! లెండిమానవులార!

 

లేవండి! లేవండి! లెండి మానవులార!
విజయమో, స్వర్గమో విక్రమించండి!

గుండె గుండెకు చిచ్చుమండించి లేవండి!
గుడిసె గుడిసెకు కోట నిర్మించిలేవండి!

వనితనంటిన మదాంధులకు గతిలేదింక!
గమిడి తొక్కిన నియంతలకు గతిలేదింక!

ఒక్క శిశువేడ్చినా, ఒకగింజదోచినా
ఉరిమి పిడుగుల్లాగ విరుచుకు పడండి!

జనశక్తియెదుట ఏశాసనాల్ నిలిచాయి!
జనశక్తియెదుట ఏచెరసాల లాగాయి!
లెండి! హోరాహోరి పోరండి! లెండి!

చావు బ్రతుకులమధ్య చెరసాలమిగిలిమన
తరతరాల్ దాస్యాన తల్లడిల్లాయి!

ఈచదుష్పాద సింహాసనంకింద మన
దానిసల అస్థులే పగతో శపించాయి!

పాతాళ బలిపీఠమైన ఈనేలపై
పాపలను ప్రసవించ 'భావి' భయపడుతోంది!

మ. ఘ. వ. మహరాజు నిష్క్రమణ చూస్తారులే!
గతచరిత్రలో ప్రభుల చితుల స్మృతులేమెందు!

లేవండి! లేవండి! లెండిమానవులార!
కాయాలు ఖడ్గాలుగా లేచి పోరండి!
కనికరంలేని కాలంలాగ పోరండి!

నైజాంప్రజా విజయకోలాహలమ్ములో
నిలువెల్ల మాతృభువి పులకరిస్తోంది!

పుట్టిన ప్రతిప్రాణి పోరవస్తున్నాము!
పొంగిన సముద్రమై పొర్లివస్తున్నాము:

చుట్టూతుపాకులతొ గోడకట్టారు—
నే రివ్వున తుపాకిగుండై చీల్చివస్తా!

లేవండి! లేవండి! లెండిమానవులార!
విజయమో, స్వర్గమో విక్రమించండి!

*

తరతరాల కలతనిద్ర:

 

తరతరాల కలతనిద్ర
తల్లడిలిన మానవుడా!

ఒళ్ళువిరిచి కళ్లుతెరిచి
త్రుళ్ళిపడిన సూర్యుడవై
గతమంతా వేదనపడి
కాలం ప్రసవించిన
నూత్నాశయమై, దిగంతముల
కధిపతివై లేచావా!

ముందువెనుక నీశత్రుల
భీషణ మారణ హోమంలో
త్రోసిన నీప్రాణం
అస్థుల మరు భూమినుండి
అజేయమై లేచిందా!

తూర్పున అరుణజ్యోతివై
అవధి నిన్ను చేరబిలుచు,
అంధజగతి వెలిగి మా
తరుణహృదయ మవశమౌను!
తరతరాల జడత్వాన
ఒరిగిన నీజీవితాన
యుగయుగాల చైతన్య
ప్రాణశక్తి విజృంభించె!

అభ్యుదయ ప్రాజిరేఖ
నీ నుదుటి జీవరేఖ!
భావిశాంత జీవితాన్ని
నీవదనం ప్రతిఫలించు!-
భూమినవ్వె నీకొరకే
పొల్లె పాడి పంటలివే!
మెరిసి కురిసి వర్షాలే
పెరిగిపొంగి సముద్రాలె
చరాచరము లేకకంత
మై ఎలుగెత్తెను నీకై!

గ్రీస్ పోలెండ్ బెల్జియం
ఫ్రాన్సులలో అంధదశలో
స్పందించిన స్వాతంత్ర్యానల
జ్వాలవు!
వికృత రాక్షస శక్తుల
విలయ విహారముకెదురై
హోరాహోరిగ పోరిన
సోదరుడా!
తరతరాల నిద్రనుండి
తలయెత్తిన మానవుడా!
నీకే ఈభువి నేటికి
నీరాజన మెత్తినదోయ్!

వెలుగునీడలలమిన సంక్షోభంలో
పాతకొర్తలెగసిన సంఘర్షణలో
అమరప్రజా హృదయముపై
రూపెత్తిన దివ్యమూర్తి!
నీఅడుగుల నడుగులుంచి

నీ నీడలో ప్రాకివచ్చు
బానిసలకు మాకు నీ
వాక్కు దివ్యజ్యోతిసఖా!

అజేయుడవు నీకు మా
విప్లవాభి వందనాలు!
ఆకాశం కెగబ్రాకే
అరుణ పతాకకు జోహార్!

*

 

తొలికారువచ్చె రారండి రైతుల్లార!
తొలిపోరువచ్చె రారండి రైతుల్లార!

ఉరిమింది, మెరిసింది ఉదధులూగించింది
నిండు చూలాలు వానలు క్రుమ్మరించింది!
జగతి పులకించింది. జలక్రీడలాడింది
జవ్వని ఎదురుచూచినటు సిగ్గుపడుతోంది!
తొలికారువచ్చింది రండిరండోయి!

ఆలుమగలను చీల్చి అతిక్రూరుడతడు
భూమినీ పురుషునీ విభజించి పాలించె!
బంగారుపంట రైలెక్కి పోయెనునాడు
కడుపు మంటకు మనకు కన్నీరుమిగిలె!
తొలిపోరువచ్చింది రండి రండోయి!

మానభంగమైన మానిని పగతోడ
చెట్లు చేమలు చేతులెత్తి ఘోషించాయి!
అసహాయమీభూమి, అన్నాతురులు మనము
ఆదరించి పోషించి పండించాలి రండి!
తొలికారు తొలిపోరు కలిశాయిరండి!

ఆకరిదప్పటి అలుబిడ్డలను
కడసారి మనసార కౌగలించండి!
పంట భూములు మనవి, పాడిగేదెలు మనవి
తెండి గొడ్డళ్ల, నాగళ్ల- సర్వంతెండి!
తొలికారు తొలిపోరు కలిశాయి రండి!

రాక్షసుడు రావణుడు పీడించడిక, జాన
కీ వియోగమ్ము లేనేలేదు రండి!
ఎర్రని ఎండలో నెరియలై విచ్చిన
నుదుట మిణుగురులద్ది ఎదురుచూస్తుందిభువి!

రండి రాముల్లార రండి రారండి!
రండి రైతుల్లార రండి రారండి!

*



ఈపురుషుడు స్త్రీప్రాణం కొన్నాడా!

ఇంటింటా ఒక దీపం-
ఎందుకారిపోయిందో?
ఏపిశాచి నిశ్వాసం శపించింది దీపాన్ని?

కొడిగట్టిన వొత్తిలాగు
పడివుందే!

ఈపురుషుడు స్త్రీప్రాణం కొన్నాడా!

ఇంటింటా ఒకకుసుమం-
ఎందుకు వాడిపడిందో?
ఏఇంద్రుని ఇనుపవేళ్లు చీల్చినవీకుసుమాన్ని!

కాలి పగులు కాగితమై
చెదిరిందే!

ఈపురుషుడు స్త్రీప్రాణం కొన్నాడా!

ఇంటింటా ఒకప్రాణం-
ఎందుకు అల్లాడిందో?
ఏస్మశాన శివస్వార్థం ధూళిగా దహించింది!

సహగమించు సతి రోషంతో
పగతో ఉడుకు తోంది!

ఈ పురుషుడు స్త్రీప్రాణం కొన్నాడా!

ఈ పురుషుడు స్త్రీహృదయం విన్నాడా!

కొన్నాడా? కొన్నాడా? కొన్నాడా?

కొన్నాడా!

## ఎడారి ఓడలు ఎదురైనవి లే!

* *

ఎడారిఓడలు ఎదురైనవిలే!
ఎడారిఓడలు ఏతెంచెనులే!

శీర్ణగృహము, జీర్ణగ్రామము
చెదిరిన మానవ శిధిలమ్ములపై
జ్వలితహృదిలో ప్రాణానిలమై
ఎడారి ఓడలు!

మార్తాండుని ప్రచండ తాపమున
ఎగసి ఎగసి పడుయిసుకలపైన
పులిపరుగెత్తిన పూలబాటలో
ఎడారిఓడలు!

కఠిన నరకముల, కదనపు వేళల
విశ్వమ్మూర్చిన విషపుటూర్పులో
పయనిస్తూ శయనిస్తూ వస్తూ
ఎడారి ఓడలు!

భవిష్యదమృత జగత్తుకోసం
తీరని ప్రతీక్ష తెరిచినరెప్పలు
దివి భువికంటగ, దాహంతీర్పగ
ఎడారి ఓడలు!

గాఢనిద్ర మేల్కొనిన కాలమే
కుబుసమ్మూడ్చిన కుండలియై
పడగలువిప్పి పట్టిన నీడలో
ఎడారి ఓడలు!

పలవరింతలో, పోరాటంలో
పల్లటిలినమా ప్రాణివల్లగా;
గర్భంతాల్చిన కలయై, ఇలయై
ఎడారి ఓడలు!

తేనెలిపి పానీయములివిగో!
నాకుటీరమున నవసిన లతరే
పసరుపోసుకొని పూతపట్టులే!

ఎడారి ఓడలు ఎదురైనవిలే!
ఎడారి ఓడలు ఏతెంచెనులే!

*

కటికరాత్రి: కనులనిదుర:




కటికరాత్రి:
కనుల నిదుర:
గడియారం గుండెనుండి
కాలం ప్రసవించు మూర్ఛ!

కలిమి లేమి సమరంలో
కాలం ఎఱ్రబడింది:
నరుల సిరులగోరీరాత్రి
పిడుగుపడిన
అడుగు విడిన
నావగ బ్రద్దలయింది!

కనులు పసులు
పట్టి పగలు:
మత్తు, మైకం, నిద్ర
మంచులా విడిపోయింది!
తాడిత భూవదనంపై
సీడ నిష్క్రమించింది!

సమధర్మం నిమ్నోన్నత
ములను కౌగలిస్తోంది!
సంగీతంగా కాలం
ప్రగతికి ప్రవహిస్తోంది!
గడియారం గుండెనుండి
ప్రాబోదయ సంస్పందన!

*

పచ్చగ ఈనేలంతా:

★ ★

పచ్చగ ఈ నేలంతా
ప్రాణ ముఋకుతోందేమిటి?

కార్చిచ్చులలో మండిన,
కడలి పొంగుతోనిండిన

ప్రాణగోళమంతా ఈ
పసరు చిమ్ముతోందేమిటి?

నరచరిత్ర క్రిక్కిరిసిన
ప్రళయ సమర సంఘర్షణ,

జారిన వీరుల రక్తం,
ఆరని వనితల దుఃఖం

ముంచెత్తిన ఈగోళం
మొలకెత్తిందా ప్రాణం!

శతసహస్ర కాందిశీక
శరణార్థుల శోకయాత్ర,

వెంటాడిన దోపిడి
తోడేళ్ళగుంపు హతమార్చిన

చల్లని ప్రాణాలు చిగురు
సాగిన వాగోళంలో!

కరవు దహించిన లోకం,
వ్యాధి జయించిన లోకం,

తనువు నిరంకుశులు వధిం
చిన సహించి, పగవహించి

బూడిదగా కాలి పున
ర్జన్మించిందా గోళం!

చెరలో మండే తలపులు
చేపని రొమ్ముల వలపులు,

అసంతృప్తులా వేదన
అన్నార్తుల కన్నీరూ

పుడమి నావరించి బ్రతుకు
పుష్పిస్తోందా యేమిటి!

నేటియుగంనిండా
పోటెత్తిన జన చైతన్యం

పూర్వుల తీరని కోర్కెలూ,
పుట్టని పాపల ఆశలు

ప్రాణ సముజ్వలతేజం
పయనిస్తోందీ గోళం!

ప్రజలంతా పసికన్నుల
పాపలై మెరుస్తారేం?

కార్చిచ్చులలో మండిన,
కడలి పొంగుతో నిండిన

ప్రకృతి బాలింతపచ్చి
పాలగుండె లాగుందేం?

*

 

పండుమానవజాతి నిండు హృదయమ్మై
ఈ ఉదయ మర్చిస్సై
వెల్గు లెగబోసినది!

అంధునకు, జ్ఞాన సంబంధునకు కనువిచ్చి
పాంథునకు, రసపిపాసునకు శాంతినికూర్చి
ఈ ఉదయమే వచ్చి
వెల్గు లెగబోసినది!

నిశ్వాసమౌ పేద జీవాణువులవిచ్చి
విశ్వాంత నిశ్శబ్ద శూన్యతలములజొచ్చి
ఈ ఉదయమే వచ్చి
వెల్గు లెగబోసినది!

లేవటే! కుమిలిపగిలిన గుండె లికమాకు,
రావటే! క్షితిలోకి క్రూరసామ్రాజ్యముల్
నిర్దాక్షిణ్యపు రాక్షసనృత్యపు
పీడకలయైన భూతయుగమేది!

గోచ రాగోచర సహోదరుల్ గోళముల్
గీతించ నేడె పుట్టినరోజు భువికి!

కదలె ప్రగతిసైన్య జయనినాదమ్మై
అమృతాచ్ఛరోచిస్సు లెగయ భువిలేచినది!

పండు మానవజాతి నిండు హృదయమ్మై
ఈః ఉదయమే శిరో
మణి యయ్యె భువికి!

*

నాకు తెలుసు! నాకు తెలుసు!

★ ★

నాకుతెలుసు!
నాకుతెలుసు!

ఉదయం కమ్మిన మబ్బులు
కుట్రపన్ను తున్నాయని!
నాకు తెలుసు!

మూసుకు పోయిందిపగలు
మూర్ఛిల్లిన శాంతియుగం!
తల్లిలేని పిల్లలాగ
ధరిత్రి యేడుస్తోంది!
నాకుతెలుసు!

పచ్చని పొలాలు; గుండెలు
పక్షులు; మానవులపైన
తెల్లని నల్లని తెరలై
దిగిపోయెను జడివాన!
నాకు తెలుసు!

తలవిరబోసుకు రాత్రి
జలక్రీడ లాడుతోంది!
వానరాత్రి పొదిగిన ద్వేషం
లోకం కమ్ముతోంది!
నాకుతెలుసు!

*

ఇదినాధర్మం! తపస్సు!



వెతికాను!
గతచరిత్ర విశుద్ధపథాలలో
కారు మొయిలు పవళించే అడవులలో,
ఇసుక పొరలబడి చెరిగిన
శతాబ్దాల అడుగులలో
వెతికాను!

నాకోసం పూచిన
నాకోసం వేచిన
ఏమైనా పూలున్నాయా? అని:

నరకయాతనా దేహం
నవసి వలిగి రోజుకుంటు
గడుపుకు వచ్చిం దెడారి-
ఇప్పటి నాలోకానికి!

వెతికాను!

బూడిదలూ పొగలుకమ్ము స్మృతిపథాలు,
కోర్కెల పులు లెగసిపోరు యువహృదయం,
ఆదిమానవుని నాడులు, ఆధునికుని మేధస్సు
అనంతముగ బంధించే అనాదిరక్త ప్రవంతి
వెతికాను!

నాకోసం వేచిన
నాకోసం పూచిన

నిర్మల కరుణాహృదయం
పిలువక పోతుందా? అని:

అఖిల జంతు సంఘర్షణ
ఆయువు కోల్పోయె నాత్మ-
నరాల వలలో ఎముకలు
నాని క్షుద్రతనువు మిగిలె!

వెతికాను!
గోళాల పరిభ్రమణం ఘోషిస్తుందో లేదో?
సమాజ గర్భంలో శిశువూపిరి పీల్చిందేమో?
గుహలూ, పొలాలు, గుండెలు
పండినవో నాకోసం?

వెతికాను!
నాకోసం లోకం యువ
నేత్రంలా మెరిసిందా!
పురాతత్వ సౌధం ఈ
మెరుపు తగిలి చీలిందా!

జీవిత సత్యజ్వాలా
కీలాంగుళి స్పృశించి, నా
తనువు వీణమీటిన నిలు
వెల్ల ప్రకంపిస్తున్నా!

ఇదినాధర్మం! తపస్సు!

*

## * 1 *

తల్లి కడుపు చల్లగ కలిగిన నాకై :
కడలి గుండె పొంగిందని,
భూమితనువు పూచిందని
ధవళ హిమాచల శృంగం
తల యెత్తిందని ఠీవిగ,
జోలపాట విన్నాను!
కళ్లు విప్పి నవ్వాను!

కాని: తల్లి కాళ్ళమీది
కడియాలే సంకెళ్ళని,
ముందుకు అడుగే లేవక,
ముందుకు చూపే చొరక,
గవ్వలో తిరిగే మోగే
గాలిపొరని తెలియలేదు!

నా నవ్వులో వికసించిన
నూత్నోత్తేజం నన్ని
దిగంత తీరం వెలుపలి
తెలియని లోకం పరిధులు,
దిక్చక్రపు ఖైదు నడుమ
పిక్కటిలు అధోజగత్తు
హృదయంలో సంక్షోభం
నిలువెల్లా వాణికిస్తే,
కలల మేడ పగిలిస్తే

నేను మానవుణ్ణయితే
తల్లిచేయి అంకుశమై ఆపింది!

నా గీతం బాధాకులిత హృదిలో
బడబాగ్నిని రగిలిస్తే;
తల్లి కేక
గుహల దాగి ప్రతిధ్వనించు
గత కాలపు గుండెమోత!
తల్లి కళ్లు
శోకపు దీపాల ప్రమిదలు!
బ్రద్దలయే చుక్కల మెరుపులు!

ఆనాడు ఆమె పోసిన ఉగ్గు పాలు
తన శాశ్వత విశ్వాసం
తనయుడు రక్షిస్తాడని!

తన దేవుడు ధనస్వామి,
తనయుని నైవేద్యమేది!
మకిల మనిషి సమూహంతో
మంటపంలో కాపురమై
స్వామిని పెకలించేందుకు
కొలిమి వూదుతున్నందుకు
తల్లి గర్భ శోకంతో తల్లడిల్లుతోంది!
దీర్ఘరోగికి సుఖమన్న భయం!

వింత కాదు:
మా తల్లి పురాజగత్తు!
నాపేరు భవిష్యత్తు!

*

## * 2 *

పోతున్నారు!
క్రిక్కిరిసినది త్రోవ
గుంపులు మూకలు మహాసైన్యమై
పోతున్నారు!

ఒకరి కొకరికెరుకలేదు, గుండెగుక్క పట్టింది
త్రోసుకుంటు త్రోవకొరకు
ప్రాణంబిగబట్టి, ఠీవిగతలయెత్తి
పోతున్నారు!

కాంక్షలవలె, కన్నులవలె కాంతులు చిమ్మేతారలు!
కడలి పొంగు ఆకాశం!
క్షణమొక యుగమై
అడుగుతీసి మరొకటిప్రళయమై
పోతున్నారు!

నాశంలో
ఉరుకులెత్తు ఉడుకులెత్తు రక్తబిందువై
పోతున్నారు!

మానవ మేధస్సే ఒకసెర్చిలైట్!
భవిష్యత్సముద్రంలో మంచిఅనే మణికోసం
భవిష్యత్సహారాలో మంచిఅనే ఒయాసిస్
బాహ్యాంతర పరిశోధన
సెర్చిలైట్ సాగిస్తోంది.

రాపిడి కాగలేని దుర్బలులంతా
ఉక్కిరి బిక్కిరై రాలి పోతున్నారు!
అడుగడుగొకచరిత్రపుటగా, మజిలీ లధ్యాయాలై
మానవ సోదరు లంతా
పోతున్నారు!

గుండెల నిండిన కాంతి గనులను
శోధిస్తున్నారు! సాధిస్తున్నారు!
"ప్రసాదించు శక్తి మాకు!
ప్రసాదించు శాంతి మాకు!"
తమ్ము తామె ప్రార్థిస్తున్నారు!
"అవధి అదే కన్పిస్తోంది
ఒడలు మాత్రం సడలుతోంది
ఎప్పుడింక? ఎప్పు? డెపట?
ఎంత నడిచిననూ అంతే దూరమేమొ!"
యాతనపడి పోతున్నారు!

పోతున్నాను!
నాహృదయం ప్రాణజ్యోతి!
నాపాదాల్ గాలిపొరలు!
మెట్టిన కంకరబంగరుగా
ముట్టినవృక్షం కల్పంగా,
నాచుట్టూ ఒక Halo
కట్టుకుంటు
పోతున్నాను!

నేనేముందడుగిడితే:
మానవసోదరులను నే

మరువబోను!
ద్రోహికాను!

అడుగుజాడ మరుగుపడి,
ప్రాణజ్యోతి పొగలుకమ్మి
తోవ మూసుకుంటుందని
ఇపుడిపుడే
అడుగడుగూ
నా నెత్తురుబొట్లు చల్లి
త్రోవకొలుస్తున్నాను
పోతున్నాను!

అవి శత్రువులతొ పోరాడే
మెషీన్గన్లు!
అవి మిత్రుల నుద్రేకించే
వి. గీతాలు!

*

* 3 *

ఉన్నతగౌరీశిఖరం బహుచిన్నది నాదృష్టికి:
నా కపాల గోళంలో లైట్ హౌస్‌లున్నాయి!
కాంతిరేఖ నాదృష్టి!

మానవులకు శాంతి, క్రాంతి మర్మాలకు ప్రసరిస్తా!
అలజడి, ఆకలి, ఇష్టం, ఈర్ష్య:
ఇలా అకారాదిగా
సంఘర్షించే, నిర్మించే
మానవుణ్ణి చూస్తాను! గ్రహిస్తాను!

అదిలోకం ఆత్మకథ:
కారణం?— నావాక్కు!
అదిలోకం గుండెమ్రోత!

భూమ్యాకాశా లరిచేతులు రెండై క్షోభిస్తే
చప్పట్లు చరిస్తే
ఉన్న సమున్నత గౌరీశిఖరం
సున్నయి దిగిపోతుంది!
విశ్వాంతర వియత్తులో శిరము నిలిపి,
భూమి పాడిపంటల్లో కాళ్ల జొనిపి
లైట్ హౌస్ నిలుస్తుంది!

జీవకాంతి చావదు!

*

* 4 *

స్వేచ్ఛావాయువు పీల్చే
స్వేదం రక్తంకార్చే
ప్రతిపౌరుని నిండుగుండె
ప్రతిష్ఠించి బలిపీఠం!
కావాలట!

నీరో, సీజర్, హిట్లర్
ఈబలిపీఠంమీదే
ప్రాణవిషం కక్కారట!
కావాలట!

మాపిల్లలరెక్కలు తెగనరికిన
మాతల్లుల రొమ్ములుతెగగోసిన
మరఫిరంగి మరచితులు
నిర్మించిన నరహంతలు
కావాలట!

వరిపైరూ, వస్త్రియంత్ర మన్నీ
ఇళ్ళూ రైళ్ళూ అన్నీ
మాపిల్లలే!
వందేభూములు; మోసే
మేఘాలన్నీ
సిరులఊటోడు నదులూ
సముద్రగర్భం అన్నీ
మా తల్లులే!

ఆక్రమించి,
నరకానికి తొక్కాలని
విక్రమించి,
తమను గుమ్మగోపురాలు
తనువులసోపానాలతో
నిర్మించిన పిశాచాలు
కావాలట!

పిశాచ సామ్రాజ్యం ఇది!
ఫిరంగి నోరెత్తి పిలుచు,
విషనిశ్వాసం స్పృశించు,
గోశాలే వేశ్యనడుమ
గోలీలుగ నటిస్తారు!
రాబందుల నీడపరిచి
రాజ్యంకాచే పతాక!
కావాలట!

కావాలట!
గతించి జితించి కూలిన
కలకత్తామరుభూమికి
కారణమైన పిశాచం!

కావాలట!
పిడికిట అర్ధంపైనా
పిండే పెరాకూడా!
స్పెయిన్ శవంపై నృత్యం
చేసే ఫ్రాంకో కూడా!

శాంతి కాంతి కుసుమాలను
చెప్పుకిందతొక్కి
ఉక్కునాడాలీ పిశాచాలు!

పిల్లలు తల్లులు ఘోషిస్తే
విషజగత్తు శేషిస్తే,
బలిపీఠం
శాశ్వత శపథం చేసింది!
కావాలట!

*

* 5 *

నీముందున్నది ప్రజ!
నీ వెనకున్నది రుజ!

ముందడుగొక్కటి వేస్తే
మూలవిరాట్టును విడిచి,
వెనుకడుగొక్కటే వేస్తే
ప్రాణదాతలను మరిచి
అదే అదే
ఆఅడుగే
నీవిలువకు కొలమానం!

చరిత్ర పవిత్ర సంగీతంలో
అధిరోహణ దశలో
నీ అడుగుతో
తప్పుడుతాళం వెయ్యకు!
వెనకున్నది
మోగని చెల్లని రాజుతల!
ముందు
బృహత్ ప్రాణికోటి ఆహ్వానం!

*

## * 6 *

ఆడవాళ్ళ సంత ఒకటి
అమ్ముడుపోతోందిచూడు!

నల్లమందు నిద్రనీది!
శ్మశానస్థ శాంతినీది!
కళ్లు విప్పితే
భయంకరపు పట్టపగలు
బ్రద్దలుచేస్తుంది కలలు!
నీప్రియ స్వప్నజగత్తు
నిర్జన నిశీథమైతే
నిను
ప్రేరేపించే ఉద్రేకించే
సంతను
ఉలిక్కిపడి చూస్తావు!
ఊపిరిబిగబట్టుతావు!

ఆడవాళ్ల సంత ఒకటి
అమ్ముడుపోతోంది చూడు!

ఊరిమధ్య:
పుండులోని బాధలాగ
మండుతోంది!
వీధిచివర తడికవెనుక
దాగినతల యెవరిది?
మూగకన్ను లెవరివి?
చేతిసైగ-'దా, దా' అని;
పిలిచే వారెవరు?

నీకు నాకు లోకానికి
తల్లి, చెల్లి, కూతుళ్లు:
మానంతో అడుక్కునే
అనాథులార్తులు అనదలు
రౌరవ నరకాగ్నిలోకి
రా! రా! అనిపిలుస్తారు!
నీవా?
సంఘ చక్రగమనంలో
ఇరుసు నీకుటుంబమా?
ఇరుసు సంతని ఒరుసుకుని
మరిగే రక్తపుకందెనతో
తిరిగి తిరిగి పోతున్నది!
సంఘచక్ర బంధంలో
సాలీ డల్లికలో
చిక్కుకున్న ఈగలుయివి!

నీకుటుంబ మిసుకగూడు-
ఒడ్డున శాశ్వత నీరవ
సమాధిగా మనుతుందని
భ్రమించకు!
ఏనడిరాత్రికో పొంగి
ఒక్కుమ్మడి కెరటాలే
ఒడ్డునూడ్చి పెడతాయి!
"నన్నెందుకు మేల్కొల్పరు?
నాకీ పాపిష్టి నిద్ర!"
అని నన్నడుగకు అప్పుడు!

నీకుటుంబం ప్రసవించిన
నీతి అడివిమృగమయింది!

ఆడవాళ్ళసంతసు నమలి
నెమరులు వేస్తోంది, చూడు!
నెపాలు వేస్తోంది, చూడు!
ఇది సమాజశరీరాన
వెన్ను విరుచు రాచకురుపు!

తడికవెనుక దాగిన తలలో
తోవపక్క అమ్మిన మొలలో
తరతరాల ఉక్రోషం
దహిస్తుంది నిన్ను, నన్ను!
శపిస్తుంది జగత్తును
పరాజిత మనస్సుతో
పరాభవిత మానంతో
గతచరిత్ర లిఖిస్తుంది!

ప్రకృతి దుర్భర భారం
పట్టదు కబళిస్తుంది!
భవిష్యత్తు నశిస్తుంది!
తల్లీ, చెల్లీ, కూతుళ్ళను
మరిచిన, చెరిచిన ద్రోహినని
తిట్టుకుంటు
భూగర్భంలో దిగిపోకు!
శోకంతో, కేకలతో
నాకోసం మొరపెట్టకు!

తలదించిన ప్రస్తుతాన
తలయెత్తిన శాసనమిది!

*

## * 7 *

ఎవరి పిల్లలోయిమీరు!

బ్రిడ్జికింద, స్టేషన్లో, ధూళిమీద
ఏటు చూచిన మీరూపులు!
ఎటువిన్నా మీఅరుపులు!
పార్కుచెట్లు, కాల్వగట్లు
అరుగులు, మరుగులు అన్నీ
ఆక్రమించి తిరుగుతున్న:
ఎవరిపిల్లలోయిమీరు!

మురికివొళ్లు, చింకికళ్ళు
మీరూపులు!
కడుపొక బాదంఆకై,
మీ చూపులు
తోపుల్లో తుమ్మముళ్ళు!

దిక్కులేని తల్లులు
దిగవిడిచారా?
మీరు గర్భాల్లోకెక్కినపుడె
వేనోళ్ళ శపించుకుంటు
శత్రుబాధలా తొమ్మిది
నెలలుమోసి,
గుట్టల్లో గుబురుల్లో
ప్రసవించి పడవేసి
తమదేమీ పోనట్లు నటించి
తరలి వెళ్ళారా?

దాగని గర్భశోకముప్పొంగి
ఆగని మాతృప్రేమ కేలొంగి
తల్లడిలుతు వెళ్ళారా?
వాళ్ళ గర్భశోకం
ఈలోకానికి తగులుతుంది!

మీకేకలు వినబడవు!
విశ్వం శోధిస్తూ పైతారలు
లెఖిస్తున్నారు!
జీవన్మరణ సమస్యలు చింతిస్తూ
బోధిస్తున్నారు!
మేధస్సముద్రంలో వేటాడి
కవిత వ్రాస్తున్నారు!
గుళ్ళ, గోపురాల్, పుష్పలశాలలు
నిర్మిస్తున్నారు!

ఎవరిపిల్లలోయి మీరు!
ఉన్నవాళ్ళ హుంకారంతో
ఉలిక్కిపడుతుంది ఎండ!
మీరంటే ఎండగూడ మండిస్తుంది!
ఉన్నవాళ్ళ ఉడుపొకటి,
స్పృశించ లేదీ వర్షం!
వానగూడ మీరంటే
వరదలు పారిస్తుంది!
విశాలప్రకృతిపూర్ణహృదయం
కావులించుకుని
పవళిస్తున్నా, రేడుస్తున్నా
రెవరు మీరు?

చలివొంటిని మెలిపెడితే,
ఎండకాల్చి వేధిస్తే

భూమాతతో మొరపెడుతూ
వెక్కి వెక్కి ఏడ్చే
ఓదిక్కులేని తమ్ములార!
నాప్రాణమిత్రులార!
ఈలోకపు శాసనాలు
ఎంగిలాకులిస్తాయి,
ఇనుపకమ్ములిస్తాయి,
న్యాయమూర్తి గ్రంధాల్లో
నల్లని అక్షరపంక్తులు
మీ మెడలకు ఉరివుచ్చులు!

ఎవరి సంతతోయిమీరు!
ప్రస్తుత సమాజ దేహపు
నుదుటి రేఖలా మీరు?
భవిష్యత్తు నూరించే
వెలుగు పోచలా మీరు?
దివ్యకాంతి మూర్తులైన
ఎండిమియాన్లెంతమంది!
సంఘపు కుంపటి వెల్గించే
సైంట్ జోన్లెంతమంది!
జీవశాంతి రసార్ద్రులౌ
జీసస్‌లెందరో మీలో!

దిక్కులేని తమ్ములార!
మిముచూస్తే
రాతిగుండె జాలువారి ద్రవిస్తుంది,
కరుణతో ప్రవహిస్తుంది!
జాలిగుండె కర్కశమై నిలుస్తుంది,
జగతి నెదుర్కొంటుంది!

*

## * 1 *

పాలపొడుగు నాతల్లి!
ప్రాణ దాత నాతల్లి!

అమ్మా, అమ్మా నీ యెద
కుమ్మిన దెవరే తల్లీ!
అమ్మా, అమ్మా నీ తను
వమ్మిన దేవరే తల్లీ!

తాడితవదనా తల్లీ!
పీడిత హృదయీ తల్లీ!

అమ్మా నట్టింటి దీప
మార్పినదేవరే తల్లీ!
అమ్మా, నీకట్టుపుట్ట
మూడ్చిన దేవరే తల్లీ!

ప్రళయశక్తి నాతల్లి!
విలయకాళి నాతల్లి!

తల్లడిలకు తల్లీ! నీ
తనయులు పగబూనారు,
ఉరివుచ్చై శత్రువుపై
కురికి ముట్టడిస్తున్నా
రమ్మా! ఆశీర్వదించ
వమ్మా! నామాతృభూమి!

*

## * 2 *

మాతృభూమి పిలుస్తోంది
మారుపలుక వేమిరా!
అడుగడుగున కంఠమెత్తి
ఆకసమూగించురా!
అణువణువున ఆయువూది
అగ్నిని రగిలించురా!
మాతృభూమి పిలుస్తోంది
శత్రువు నెదిరించరా!
పుడమినిండ నీనెత్తురు
పుష్కలముగ చిమ్మరా!
పురాదాస్య పరాభవము
పూర్తిగకడిగేయరా!
మాతృభూమి పిలుస్తోంది
మారుపలుక వేమిరా!
ఉక్కుబందిఖానాలను
ముక్కలు చెయ్యాలిరా!
గడియసేపు కాలమాపి
గతలోకం మార్చరా!
మాతృభూమి పిలుస్తోంది
మానవుడా లేవరా!
ఒక్కటానిసున్నా ఈ
లోకానికి ముక్తిలేదు!
పిడికిళ్లెత్తి జగత్తును
పిండిగొట్టవేమిరా!
మాతృభూమి పిలుస్తోంది
మారుపలుక వేమిరా!

## * 3 *

నల్లఖైకోట్లప్రజ
విప్లవకంఠం నాగీతం!
నేనెదిగిన మట్టినాది!
నాదేయని ఘోషిస్తా!

నాసంపదకగ్గిపెట్టు
నీచుల బలిగావిస్తా!
నల్లఖైకోట్లప్రజ
విప్లవకంఠం నాగీతం!

మరచక్రపు కందెనగా
మరిగినప్రాణుల పగతో,
కర్రుకింది కంకరగా
పగిలిన ప్రాణులపగతో

నేనెదిగిన మట్టినాది!
నాదేయని ఘోషిస్తా!
నాయుగాన్ని బంధించే
సంకెళ్ళను ఛేదిస్తా!

మృతవీరుల సమాధుల్లొ
మ్రోగుతోంది నాగీతం!
జీవన్మృతుల హృదయాల్
చీల్చుతోంది నాగీతం

వద్దు! నాకు వర్గాలుగ.
నరులను చీల్చే న్యాయం!

వద్దు!నాకు, భూమికి సరి
హద్దులు కొలిచే న్యాయం!

నలభై కోట్ల ప్రజ
విప్లవకంఠం నాగీతం!
నాదేశం వల్లకాడు,
పౌరులస్థి పంజరాలుగా
దోచిందెవరురా?

నేనెదిగిన మట్టినాది
నాదేయని ఘోషిస్తా!
నారక్తం ధారపోసి
నవలోకం స్థాపిస్తా!

నరులు పోరిపడినా
మానవుడు నడుస్తాడురా!
విశ్వరుచిర చిరస్వప్నం
వెలిసెనురా మానవుడై!

నేనెదిగిన మట్టినాది
నాదేయని ఘోషిస్తా!
నలభై కోట్ల ప్రజ
విప్లవకంఠం నాగీతం!

*

## * 4 *

లేవరా! లేవరా! కూడులేనిసోదరా!
లోకపుసిరిసంపదలకు మనకూ హక్కుంధిరా!

బంగరుభువి, పాలనదులు
ప్రాణసముద్రం దేశం!
బాడబాగ్నిలేచి శత్రు
కోటలను దహించనీ!
లేవరా! లేవరా! నీడలేనిసోదరా!
నరులకవని చెరసాలగ,
పడతి కిల్లు సమాధిగా,
బంధించిన కిరాతకం
పటాపంచలౌనురా!
లేవరా! లేవరా! కూడులేనిసోదరా!
పామరుల శిరస్సులతో
బంతులాడు పాలకులను
ప్రగతి చక్రఘట్టనతో
సంహరించ వలెనురా!
లేవరా! లేవరా! నీడలేని సోదరా!
మతంతాగి నగరాల్ నర
రక్తంలో నాట్యమాడు,
సడలిన మనపల్లెబడుగు
నడుము విరుగద్రొక్కెనురా!

లేవరా! లేవరా! కూడులేని సోదరా!
లోకపుసౌందర్యానికి మనకూ హక్కుందిరా!

*

## * 5 *

కోటశత్రుజండాతో
కోరి పిలుస్తోందిరా!
గుండెనిండ పౌరుషాగ్ని
మండేవాడెవడురా!

ఒకతన్నుకు కోటగోడ
వ్రక్కలుచెయ్యాలిరా!
శిరసునెత్తి కోటబురుజు
ఛిద్రం చెయ్యాలిరా!

కోటమీది ఆజండా
కోరిపిలుస్తోందిరా!
గుండె నిండ పౌరుషాగ్ని
మండే వాడెవడురా!

గుండెనొడ్డి సింహాసన
పీఠం పెకలించిలేచి
కోటకొమ్ముకెక్కి విజయ
ఘోషతొ మ్రోగ్రోమ్మయరా!

కోటమీది ఆజండా
కోరి పిలుస్తోందిరా!
గుండెనిండ పౌరుషాగ్ని
మండేవాడెవడురా!

తుపాకి గుండ్లతొ దేహం
తూట్లుపడిన ధూళియైన
పిడికిలి పిడుగై జండా
పెకల్చి తేవాలిరా!

కోట శత్రుజండాతో కోరిపిలుస్తోందిరా!
గుండెనిండ పౌరుషాగ్ని మండేవాడెవడురా!

*

# * 6 *

నిజంకాదు! నిజంకాదు!
నాదేశం-
తొలిపూవై విచ్చిందని
నవవసంతమొచ్చిందని:
అకరితో నాల్గుచెరగు
లంటుకుంది, దహిస్తోంది!
నిజంకాదు! నిజంకాదు!
నాదేశం-
నలుగురిలో తలెత్తి, స్వే
చ్ఛానృత్యం చేస్తోందని,
మరతుపాకి మడమకింద
పడిరక్తం కక్కుతోంది!
నిజంకాదు! నిజంకాదు!
నాదేశం-
చీలి ఛిద్రమౌతుందని:
నిప్పుకణిక లీ అస్థులు
నిలిచి ఎదుర్కొంటాయి!
ప్రగతి శక్తులీప్రాణాల్
పగతుర వేటాడుతాయి!

ఆనాడు వసంతనృత్య
మనంత ప్రాణోత్సవము!

*

## * 7 *

నాకుతెలుసు!
నాకుతెలుసు!
జగతి ఎదుట సగర్వాన
ఊగుతున్న ఎర్రపూలు
నాకుతెలుసు–
        మృతవీరులు పడిన వేది
        నెత్తురోడికలుగట్టిన
        నేల పూలుగా వెల్గెను!
నాకుతెలుసు!
నాకుతెలుసు!
జగతినెదిర్చే దీక్షతో
ఎగిరే మానవపతాక
నాకు తెలుసు–
        అనాధ నరసహస్రాల
        ప్రాణతృష్ణ రగిలించిన
        అనంత త్యాగజ్వాల!
నాకుతెలుసు!
నాకుతెలుసు!
జగతిని ముంచెత్తు ఎర్ర
నెర్రని శుభోదయం
నాకు తెలుసు–
        మన త్యాగాల్ వృధకావని
        ముందుతరా లరుణవదన
        మృదుహాసం చేస్తున్నవి!

సూచిక

*

# జ్వాలాతోరణం: 1941-47


తెగనిగొలుసులో లంకెలు 9
వచ్చాను వచ్చాను వ్యాససంతతివాణ్ణి! 10
పిడికిలికి చాలని పేదగుండెగదా! 12
ప్రతి ఒకడూ శివుడు నేడు! 13
మీతో నేవుంటాను! మీతో నె వస్తాను! 15
తల్లీధరణీ! నీయెదచల్లగా 17
ఎందుకు తల్లీ నన్నీ 19
ఎంతచక్కని కనులు ఈరాత్రివిప్పినది! 21
రండులేచి! రండులేచి! 24
నీకోసమే కాచుకోని కూచున్నాను! 28
నేనుగూడ! నేనుగూడ! నడుస్తాను 30
అయ్యో! మనబెంగాల్ ప్రజ 32
పగలుపగిలిన గాజుపేటిక 35
వెడలకుతల్లీ! ఇలుకదిలి వదిలి 38
మద్రాసు మహానగరం! 40
లేవండి! లేవండి! లెండిమానవులార! 46
తరతరాల కలతనిద్ర 48
తొలికారువచ్చె రారండి! 51
ఈపురుషుడు స్త్రీప్రాణంకొన్నాడా? 53
ఎడారిఓడలు ఎదురైనవిలే! 55
కటికరాత్రి; కనులనిదుర! 57
పచ్చిగ ఈనేలంతా 58
పండుమానవజాతి నిండుహృదయమ్మై 60
నాకు తెలుసు! నాకు తెలుసు! 62
ఇది నాధర్మం! తపస్సు! 63

## శాసనాలు: 1945


తల్లికడుపు చల్లగ కలిగిననాకై! 67
పోతున్నారు క్రిక్కిరిసినద్రిత్రోవ! 69
ఉన్నత గౌరీశిఖరం! 72
స్వేచ్ఛావాయువు పీల్చే! 73
నీముందున్నది ప్రజ! నీవెనకున్నది రాజ! 76
ఆడవాళ్ళసంత ఒకటి! 77
ఎవరిపిల్లలోయిమీరు! 80


## మాతృసంగీతం: 1946


పాలపొదుగు నాతల్లీ! 85
మాతృభూమి పిలుస్తోంది 86
నలభైకోట్లప్రజ విప్లవకంఠం 87
లోకపు సిరిసంపదలకు 89
కోట శత్రుజండాతో! 90
నిజంకాదు! నిజంకాదు! 91
నాకు తెలుసు! నాకు తెలుసు! 92






## సవరణలు

15 వ పేజీ 12 వ పంక్తిలో "దాస్యమే"; 20 వ పేజీ 2 వ పంక్తిలో "నిప్పుల"; 21 వ పేజీ 4 వ పంక్తిలో "రొమ్ములేపొంగ"; 28 వ పేజీ 18 వ పంక్తిలో "జీవకంఠమై"; 32 వ పేజీ 17 వ పంక్తిలో "లిఖించు".

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA101 B1Q1 |
| పుస్తకం పేరు | 6ఠ వేకి |
| తారీఖు | 24-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 8, 66, 89, 2, BCi,CI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |